The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును
హైదరాబాదు దక్కన్

~~103321~~
103320

Golconda Patrika. Hyderabad, Dn.

సంపుటము ౭ { శా. శ. ౧౮౫౪ అంగీరసనామ సం॥ర ఆషాఢ బ॥ 3 బుధవారము 20-7-32 { సంచిక ౫౭

## కామన్సు సభలో హోరుగారి ప్రసంగము

తమను శత్రువుగ పరిగణింపవలదని హోరుగారు భారతీయులకు కోరుట

గాంధిమహాత్మునితో సంప్రతించి సమాధాన పడవలయునని లాన్సుబరీగారు రాజప్రతినిధికి సలహానిచ్చుట

లండన్, జూలై ౧౬:—

"భారత రాజ్యాంగవిధానమును త్వరలో నమలుజరుపుటకు రెండువిషయములు చాల ముఖ్యమైనవిగలవు. కావున దొరతనమువారి సూచనలను గూర్చి పార్లమెంటు ఆలోచించుటలో వీటిని ముఖ్యముగా గమనింపవలెను. సలహాసంఘములో భారతీయులు కడవరకును సహాకార మొసగించుచుండవలెననియే దొరతనమువారు ముఖ్యముగా కోరుచున్నారు. భారతీయ ప్రముఖులగు వ్యక్తులతో అవసరమగు కాలములోను కీలకాలములోను దొరతనమువారు ఆలోచించెదరు. పని చురుకుగా జరుగవలెనను ఉద్దేశముతోనే నిటీవల చేసిన సూచనలనుగూర్చి యితరులు సూచనలు చేయదలచినచో నేను సంతసించెదను,, అని హోరుగారు తెలిపిరి.

## ప్రభుత్వము వారి విధానము మారవలెను

లేనిచో లేబరుపార్టీవారు తోడ్పడజాలరని లాన్సుబరీగారు తెలుపుట

లండను, జూలై ౧౬:—

"ఇండియానుగూర్చి దొరతనమువారిపుడు అనుసరించుచున్న పద్ధతియును వారిభావమునుగూడ మారినచేగాని బ్రిటిషు లేబరుపార్టీ వారితో సహాకార మొసగింపజాలరు. దొరతనమువారి పేరట యిండియా మంత్రి పార్లమెంటులో నిదివరకే ప్రతికూలమగు ప్రకటన చేసియుండినను యిప్పుడైనను రాజప్రతినిధి గాంధిగారిని కలుసుకొని అన్నివిషయములనుగూర్చియును సంభాషించినచో చిక్కులుతొలగగలవు. అందుల కింకను కాలాతీతము కాలేదు. ఇండియాను పరిపాలించినవారిలో విల్లింగ్డను ప్రభువు అధికోదారభావుడను ప్రఖ్యాతిగలదు కావున నతని నిట్టుల చేయగోరెదను." అని పార్లమెంటులో చర్చముగిసిన పిమ్మట లాన్సుబరీగారు మా విలేఖరి కెరిగించిరి.

"పద్ధతినిగూర్చిన ప్రశ్నల విషయమై మన బ్రిటిషు పార్టీలలో కూడ తరుచుగా అపోహాలు కలుగుచుండుట మనకు క్రొత్తగాదు. ఈ విషయము సగూడనబులనే ప్రభుత్వపక్షమువారి అభిప్రాయమునుగూర్చి లేబరు పార్టీవారికి లేనిపోని అపోహాలు కలిగినవి. ఆ విషయమును నేనిపుడు స్పష్టపరచగోరెదను. ఈ సభలోని సభ్యులలోనే కొందరి కిట్టిఅపోహాలు కలిగినపుడు భారతదేశమునందు కొందరికి అపోహాలు కలుగుటలో నాశ్చర్యమేమున్నది? ఈ సభలోనే కొందరు విపరీతార్థ కల్పనచేయుట కవకాశమేర్పడినపుడు ౬౦౦౦ మైళ్లదూరమునందున్న యిండియనులు దురభిప్రాయ పడుటలో వింతయేమియుగలేదు.

### భారత ప్రముఖులలో ఆందోళనము

సపురోజులక్రితము నేనీసభలో చేసిన ప్రకటనను గూర్చి భారతదేశమునందు సుప్రసిద్ధ నాయకులలో కొందరికి అత్యధికముగ నాందోళన కలిగినమాట నిశ్చయమే. సప్రూ జయకరు జోషీగార్లు సలహా సంఘ సభ్యత్వమునకు రాజీనామాలనిచ్చిరి. వారును మరి పదిమందియును యిటీవల బొంబాయిలో సమావేశమై నా ప్రకటన నాక్షేపించుచు నాకును ప్రధానమంత్రికినిగూడ తంతివార్తల నంపిరి.

### చాలమంది భారతీయులు హోరుగారి ప్రకటన నామోదించుట

వీరు నా ప్రకటనకు అసమ్మతి తెలిపినమాట నిజమేగాని భారతదేశమునందే అనేక గొప్పసంఘముల నిజమైనప్రతినిధులును మిక్కిలి అధికమగు పలుకుబడి గలవారునగు నాయకులు మిక్కిలిమంది నా ప్రకటనను పూర్తిగా నామోదించుచు నాకు తంతివార్తలను పంపియున్నారు.

### సప్రూ జయకరుగార్ల రాజీనామాలు

సప్రూ జయకరుగార్లు రాజీనామాల నిచ్చుటయొక గొప్పవిషయము కాదని దానిని చులకనచేయుటకు నేనిటుల తెలిపితినని మీరు భావింపగూడదు. దొరతనమువారి క్రొత్తపద్ధతిని ఆమోదించినవారే మిక్కిలి హెచ్చుగా నున్నారని తెలుపుటకే నే నీవిషయమును వివరించితిని.

### కాంగ్రెసువారి సత్యాగ్రహము

౧౯౩౧ డిసంబరు మొదలు యిప్పటివరకును ఇండియాలోను బ్రిటనులోనుగూడ స్థితిగతులు చాలవిషమముగానే యుండెను. ౧౯౩౧ డిసంబరు నెలాఖరున కాంగ్రెసువారు మరల సత్యాగ్రహమును ప్రారంభించుటచే భారత రాజ్యాంగవిధానమునుగూర్చి పనిచేయదలచిన మాకందరికిని అడుగడుగునకు అభ్యంతరములు కలుగుచునే యుండెను. కాంగ్రెసువారు మరల సత్యాగ్రహమును ప్రారంభించుటవలన అనేక విధములుగా నిరోధము లేర్పడెను. దీనివలన యిండియాలో మితవాదులకు యింకను అధికమగు యిబ్బందులు కలిగెననిగూడ నేనెరుగుదును. గత ఆరునెలలలోను భారత మితవాదులకును బ్రిటను దొరతనమువారికిని సత్యాగ్రహమువలన చాల యిబ్బందులు కలిగినవి.

### ఏదోయొకటి త్వరగా తేల్చుడని విన్నపములు

ఇందువలన భారతీయులు చాలమంది "ఏదోయొకటి త్వరగా తేల్చుడు" అని దీనినిగూర్చి నాతో స్వయముగా చెప్పుచున్నారు. "బ్రిటిషు దొరతనమువారు చేయదలచిన సూచనలను బయటబెట్టి యీసందిగ్ధస్థితిని తొలగింపుడు. ఈ స్థితి యేళ్లతరబడిగా వచ్చుచున్నది. దీని కంతు కనబడుటలేదు,, అని అసంఖ్యాకులగు భారతీయులు నాకు ఎడతెరపిలేకుండ లేఖలను తంతివార్తలను పంపుచుండిరి.

### ఒక్కబిల్లునే ఉపపాదింపవలెనని భారతీయనాయకులు కోరుట

రెండు బిల్లులను విడివిడిగా నుపపాదించుటకు భారతీయ నాయకులలో చాలమంది ప్రతికూలురుగా నుండిరి. ముఖ్యముగా సప్రూ జయకరుగార్లు మున్నగువారు దీనిని నిరసించుచు నిష్కర్షగా నా

తో చెప్పియుండిరి. అపుడు మరల ఫెడరలుకమిటీ సభలను రౌండుటేబిలు సభలను లండనులో అకురాలు కాలములోను శీతకాలములోను జరుపునెడల ఒక్క చట్టమును మాత్రమే ఉపపాదించవలెననిన నది త్వరలో నెంతమాత్రమును కొనసాగదు.

చివరకు ఈ సమస్యను పార్లమెంటువారే పరిష్కరింపవలసియుండును. అని మేము మొదటినుండియును స్పష్టముగా తెలుపుచునే యుంటిమి.

ఈ విషయమును అపుడు గవర్నరు జనరలుగానుండిన యిర్విను ప్రభువు మొదట స్పష్టపరచెను. పిమ్మట ప్రధానమంత్రికిని యిపుడు పార్లమెంటులో ప్రతికూల పక్షనాయకుడుగా నుండిన బాల్డువిను గారికిని జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములలో మరల నీవిషయము స్పష్టపరుపబడెను.

వాగ్దానము లను భంగపరచుట

అసత్యము

ప్రధానమంత్రి ప్రకటనలో చేయబడిన వాగ్దానమును మేము భంగపరచితిమని భారతనాయకులాక్షేపించిరి. అది నిజముకాదు. ప్రధానమంత్రి చాల ధీమంతుడును జాగ్రత్తగలవాడు నగుట ముందు అవలంబింప బడవలసిన పద్ధతులను గూర్చి నిర్ధారణగా నేమియును తెలిపియుండలేదు.

అల్పసంఖ్యాకుల సమస్య

1931 డిశంబరుకు దరిమిలాను రెండు క్రొత్త యిబ్బందులు కలిగినవి. అల్పసంఖ్యాకులసమస్యనుదొరతనమువారే పరిష్కరింపవలసి యుండునని అపుడు నిర్ధారణగా తెలియలేదు. భారతీయనాయకులు తమలో తాము యీ సమస్యను పరిష్కరించుకొనజాలకపోవుటచే దొరతనమువారే దీనిని పరిష్కరింపవలసి వచ్చినది.

ఈపరిష్కారము ను మేము యీ వేసవిలో చేసెదమని మీరు నిర్ధారణగా తెలుసుకొనవలెనని మరల దీనినిగూర్చి యెవరికిని యెట్టిసంశయమును కలుగగూడదు.

కాంగ్రెసువారు సహకారము

చేయకపోవుట

గాంధిగారి పక్షమువారుగూడ మాతో సహకారము చేసెదరనియే 1931 డిశంబరులో మేము ఆశించితిమి. గాని అటుపిమ్మట యేర్పడిన కారణములవలన దానికి భంగము కలిగినది.

నేను భారతదేశమునకు విరోధిననియు, నేను కన్సర్వేటివు పార్టీకి చేరిన ఇండియా మంత్రిననియు, ఆలస్యము చేసెడివాడననియు, భారతదేశ స్వాతంత్ర్యమునకు ప్రతికూలుడను, యిబ్బందులను అడ్డంకులను కలిగించుచుందును, నాకు భారతీయుల కోర్కెలయెడల లేశమైనను సానుభూతిలేదు, వారి విధానముల కన్నిటికిని నేను ప్రతికూలుడను.

అనియు విఖ్యాతులగు భారతీయ నాయకులలో పలువురికి నన్నుగూర్చి చాల చెడ్డ అభిప్రాయము కలదని నేనెరుగుదును. వారికి నన్నుగూర్చి యిట్టి అభిప్రాయము కలిగినందులకు నేను మిక్కిలి చింతిలుచున్నాను.

సలహా సంఘములో తుదివరకును వారు సహకారము సలుప వలెననియే ముఖ్యముగా కోరుచుచున్నాము.

మహమ్మదీయులు ప్రతికూలురుగా

నుండుట

అల్పసంఖ్యాకుల సమస్యను పరిష్కరించువరకును సలహాసంఘమున చర్చలలో పాల్గొనజాలమని ఆ సంఘసభ్యులు మహమ్మదీయ ప్రముఖులు తెలిపిరి అందువలన అల్పసంఖ్యాకుల సమస్యను పరిష్కరించినచో మహమ్మదీయులు సహకార మొసగించెదరను పరిష్కారమును మహాసంఘ సభ జరుగును. భారతప్రధాననాయకులు సహకారమునలిపెదరు. అటుపిమ్మట భారతప్రముఖులకు వ్యక్తులతో సంభాషణలు జరుగును,, అనియే నే నాశించుచున్నాను.

నిర్ధారణతోకూడిన సూచనలు

దొరతనమువారు తమ సూచనలును నిర్ధారణగా వ్రాసిన పిమ్మట రెండు పార్లమెంటు సభలప్రతినిధులతోను భారత ప్రతినిధులతోను కూడియున్న జాయింటు కమిటీవారికి వాటిని పంపెదరు. అపుడు భారతీయులు వాటినిగూర్చి చర్చించుటకువీలగును. ఇదియొక ముఖ్యతమమగు క్రొత్త లాభము. రౌండుటేబిలు సభలో నీ లాభము కలుగదు.

"పని త్వరగా జరుగవలెను. భారతీయుల సహకారము కడవరకును లభించవలెను. చివరకు పార్లమెంటువారే తీర్పు చెప్పవలెను."

"ఈమూడును ముఖ్యాంశములు గాన వీటిని నెరవేర్చుటకు శ్రేష్టములగు సూచనలను బ్రిటిషు ప్రముఖులు గాని భారతప్రముఖులు గాని చేయుదలచినచో నేను సంతసించెదను"అని హోరుగారు నుడివిరి.

ఐరిషు సమస్య

డివెలరాగారి ప్రకటనము

ఐరిషు భూమి సొత్తములనుగూర్చి పరిష్కరించుటకు సామ్రాజ్యవిచారణ సంఘమునుగూర్చి ఒడంబడిక కుదురుచో మరియు విచారింపవలసిన విషయములగూర్చి కూడ ఉభయులకు అంగీకారమగుచో ఈ మధ్యవర్తిపరిష్కారమును ఒప్పుకొనుట మంచిదని ప్రభుత్వమునకు తోచినేని అటులచేయుటకు వేసవికాలమున డెయిల్ పార్లమెంటును సమావేశ పరచెదనని డివెలెరాగారు ప్రకటించిరి.

రాజభక్తి ప్రమాణ చట్టమునుగూర్చి డివెల రాగారిట్లు ప్రకటించిరి. సెనటు గావించిన సవరణలను అంగీకరించజాలము. ఆంగ్లో ఐరిషు ఒడంబడిక ద్వంద్వార్థముగనున్నది. ఆద్యంతము అయ్యదిఅటులనే కావలెనని చేయబడెను. బ్రిటిషు సామ్రాజ్యముతో సంబంధము వదలుకొని స్వాతంత్ర్యము కావలెననుచో నురల ఈ ప్రమాణమును పట్టుకొని సామ్రాజ్యాంతర్గత మగుట కెట్లంగీకరించెదరు? డెయిలులో స్వతంత్రపక్ష సభ్యుని ప్రశ్నకు డివెలరాగారిట్లు ప్రత్యుత్తరము నిడిరి: మానము మర్యాద అయిన పనిని చేయలేదనియు కామన్వెల్తునుండి విడిపోవలెనని ప్రజల నేలయడుగ లేదని ఈసభ్యుడు నన్ను ప్రశ్నించుచున్నాడు. ఇట్టి పనులు జరుగురోజు త్వరలోనే వచ్చుగాక యని యాశించుచున్నాడను కాని ప్రస్తుతముమాత్రము అట్టిపనికి ఐరిషు ప్రజలు పూనుకొనజాలరు బ్రిటిషు సామ్రాజ్యముతో మన ము సంబంధమును వదలుకొనెద మన్నపుడు దానిని విరోధముగ భావించెద మని బ్రిటిషు మంత్రివర్గము స్పష్టముగ ప్రకటించక పోవుటచే ఇపుడే ఆపనికి పూనుకొనజాలమనిరి బ్రిటిషు ప్రభుత్వము వారట్లు ప్రకటింపనందున ఆపదవ జూచెదముగాక యనిరి.

ఆంగ్లో ఐరిషుఒడంబడికను నిర్బంధము చేసినంతకముచేయుచుకొనుట అయ్యది తమరిని బాధించదనిరి.

## 1500 రూ॥ల బహుమానము

సర్ ఛార్లెస్ టాగార్టును చంపప్రయత్నించిన వాడు

కలకత్తా పోలీసు కమీషనరగు సర్ ఛార్లెస్ టాగార్టుగారిని డాల్ హౌసీస్క్వేరువద్ద చంప ప్రయత్నించినందులకు దినేశచంద్ర మజుందారు యావజ్జీవద్వీపాంతరవాస శిక్ష విధింపబడి యుండెను కాని యితడును నచింకర్ గుప్తాయును చెరసాలనుండి పారిపోయిరి. దినేశ్ చంద్రగుప్తాను పట్టుకొనినవారికి 1500 రూపాయలు బహుమానము నిత్తురనియు, నచింకర్ గుప్తా విషయమై ఆచూకి నిచ్చినవానికి 500 రూపాయలు బహుమానమిచ్చెదరనియు ప్రభుత్వమువారు ప్రకటించిరి.

హిజ్లీ డిటెంషన్ క్యాంపునుండి తప్పించుకుపోయిన నళినిదాసు, ఫణిదాస్ గుప్తాగారలను, డాల్ హౌస్ స్క్వేరు బాంబు దురంత సందర్భమున తప్పించుకు తిరుగుచున్న గోవిందరామ్ గారిని పట్టుకొనినవారికి చెరి 1000 రూపాయలు యివ్వబడునని ప్రకటింప బడినది చిట్టగాంగులో విప్లవోద్యమము కొనసాగించు చున్న హరిపాదముఖర్జిగారిని, ఢక్కా విప్లవోద్యమము కొనసాగించుచున్న సూపత్ రామ్‌చౌదరిగారిని బర్ద్వాన్ జిల్లాలో ప్రవాసిగా నుంచబడి తప్పించుక పోయిన సూపత్ రాయ్ చౌదరిని పట్టుకొనినవారికి 500 రూపాయలచొప్పున యివ్వబడును.

ఇంకా విప్లవోద్యమములలో పాల్గొనినవారి పట్టిచ్చినచో 250, 100, చొప్పున నిత్తుమని ప్రభుత్వమువారు ప్రకటించినారు.

## మామ కోడలిని ఉంచుకొనుట

కలికత్తా, జూలై 13:—

బసీరుహాట్ సర్దార్ ఘటికున్న అతని సోదరుడు చూటనున్న తండ్రి బలరామున్ని కొట్టి చంపివేసిరని విచారణకు కేబడిరి ఆలీపూరు సెషన్సు జడ్జి విచారించి ఇరువురికి ఆరేసినెలలు విడిశైదు విధించెను. ఈకేసు వివరము లివి—బలరాముడు ఘటికు భార్యను ఉంచుకొని యుండెను. ఒకదినము రాత్రి అతడు పడిగదినుండి బయటికి వచ్చుచుండగా అన్నదమ్ములిద్దరును కట్టెలతో నెత్తిపై మోదిరి, తదనంతరము తండ్రి మరణించెను. హత్యకు సమర్థనీయమగుకారణ మేదేని గలదేని, యిది తప్పక అట్టి దగునని యు, నేరము కఠోరము విషాదమనియు జడ్జి చెప్పి నిందితులకు తేలికశిక్ష విధించెను.

# నిజామ్‌సాగరు చెరువు దాని మహిమ

రాజ్యశ్రేష్ఠులయిన, హిజ్. ఎ. హైనెస్ (H.E.H.) నైజాము సర్కారు అలీవారు తమ న్యాయపరిపాలనచే హిందూదేశమంతటను పేరుపొందియున్నారు. వీరు తమ ప్రజలను కన్నకొడుకులకంటె యెక్కువ ప్రేమతో చూచెదరని చెప్పుటకెన్నియో ఉదాహరణములు గలవు అందు నిజామ్‌సాగరు చెరువు అగ్రస్థానమలంకరించును.

నిజామాబాదుజిల్లాయందు వానలు సరియైనకాలము లందు పడక పంటలన్నియు నాశనమయ్యెను. అదివఱకే మంచినీటిలోలేని బీదకాపులకు వానలుకురియకపోవుటవలన దానిపై కరువు సంభవించుటవలన పుండుపై రోకటిపోటు పెట్టినట్లయ్యెను. కట్టుకొనుటకు కావలసినంత బట్టలేక ఉండుటకు యిల్లులేక తినుటకు పొట్టనిండా యైనను అన్నము దొరకక కులమలమాడుచు అల్లాడుచున్న యీ బీదరియాయల కష్టము లచూచినవెంటనే ప్రభువుగారి హృదయము చలించెను. వారు బాగుగా నాలోచించి కాపుదనము చేయువారి రక్షణార్థమై హుమారు నాలుగుకోట్ల ఏబదిలక్షల రూపాయలను ఖర్చుపెట్టి నిజాముసాగరు చెరువును తయ్యారు చేయించిరి. ఈ చెరువు నిజామాబాదుజిల్లాలో, బోధన్ తాలూకాయందు అచ్చంపేట గ్రామసమీపమునగలదు, మాంజిర, అనుయేటిని అప్పాషీవారు ఒక పెద్దవంతెనచే ఆపివేసి నిజామ్‌సాగరు చెరువును కలుగజేసి యున్నారు. పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటువారు (P.W.D) యీ చెరువునుండి నీటిని పిల్లకాలువలద్వారా నిజామాబాద్, బోధన్, ఆర్‌మూర్ తాలూకాలకు ప్రవహింపజేయుచున్నారు.

నిజాముసాగరు చెరువువలన చాల ఉపయోగములు కలవు. చెరువు నీటిని అన్నివిధముల ఉపయోగించుటకుగాను, సర్కారువారు సకలవసతులను సహాయములను చేయుచున్నారు. అవన్నియు యీ క్రింద విపులముగా వివరించెదము:—

చెఱువునకై కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టి సర్కారు అలీవారు దానివిషయమై ఏమియు చేయకుండ నిద్రపోవుచుండను కావలసినన్ని; అనుకూలములను కల్పించి నీటిని ఉపయోగించుటకై బీదరైతులకు తగిన సహాయముల చేసెదరనుట సహజము. ఇదిముమ్మాటికి నిజము కాబట్టి కాపులు యీ మౌఖాను పోగొట్టుకొనక క్రొత్తగా వ్యవసాయపు తరీచేయుటకు బాగుగా ప్రయత్నించవలెను. ఇంక ముందు వచ్చేకాలములో సర్కారువారు యిప్పుడు చేయునంతసహాయమును చేయకపోవచ్చును. ఈచెఱువుక్రింద కొన్నిలక్షల యెకరములకుష్కీభూమి తరీగా మార్చుటకు అంచనా వేయబడినది నూతనముగా సాగుబడిచేయు భూములపై సర్కారువారు తహాశీలు క్రమప్రకారము హెచ్చించుచు అయిదవసాలువరకు కుష్కీని తరీచేయు భూములకు కుష్కీభూమి పన్నుమాత్రమే తీసుకొనెదరు. రెండవయేడులో రూపాయకు నాలు అణాలవంతునను, మూడవయేడులో రూపాయకు ఎనిమిది అణాలవంతునను అయిదవయేడాదిలో పూరా తరీపన్నును గైకొనెదరు. ఈపద్ధతి కాపులకు నిజముగా అనుకూలమైనది. ముందుగా పెట్టుబడి పెట్టలేని బీదవ్యవసాయదారులకు కావలసినకాలములందు సులభ మిత్తులతో తక్కావి, నకదును యిచ్చుచున్నారు. ఈ తక్కావి, పైకము మరల పంటలమీద వచ్చు, ఆదాయములోనుండి వసూలుచేసుకొందురు. నూతనముగా తరీచేయునట్టికాపులకు జిరాయితీ మహకమావారు మంచిమంచి ఎడ్లను సరసమైనధరలకు విక్రయించెదరు. అక్కడక్కడ గొప్పగొప్ప ఖసబాగ్రామములలో ఎరువుల మకానములను పెట్టెదరు.

ఇదివరకు బీదకాపులు తమగ్రామములలో చాలతక్కువధరలకు పండినమాలునంతయు విక్రయించవలసివచ్చుచుండెను. ఇకముందు యట్టినష్టము లేకుండా సడకులసహాయమున తమ యిష్టమువచ్చినచోట వ్యవసాయదారులు తమమాలును విక్రయించుకొనవచ్చును. లోకల్ ఫండువారు సడకులవిషయమై అరువదివేల రూపాయలను ఖర్చుపెట్టియున్నారు, పబ్లిక్ డిపార్టుమెంటువారు (P. W. D.) కొన్నిలక్షలరూపాయలను ఖర్చుపెట్టి మంచిమంచి శాశ్వతములగు సడకులను వేసియున్నారు, ఈ విధముగా సుందరమగు సడకులు యిరుప్రక్కల మంచి విశాల వృక్షములుగలిగి నేత్రానందకరముగా మనకు చెక్కచోట్ల బోధన్ తాలూకాలో గానవచ్చుచున్నవి.

ఇంతియేగాక లోకల్ ఫండువారు కొన్నిగ్రామముల యెడల జనుల ఉపయోగార్థమై, సున్నపుబట్టీలలో వ్యాపారముగా నుండునట్లు బావులను త్రవ్వించి నీటివసతిని కలుగజేసి యున్నారు, బాన్‌వాడ, రుద్రూరు, బోధన్ మొదలగు ఖాజీపేట మొదలగుచోట్ల అంగడులను వృద్ధిచేయుచున్నారు. పూర్వము గ్రామములలోనున్న అంగడులను తీసివేసి యిప్పుడు గ్రామము బయట మంచి మైదానమునందు పెద్దచెట్ల అంగడులను కట్టించి చెట్లనునాటించి నూతన అంగడులను బాగుగా సాగింప ప్రయత్నించుచున్నారు.

రుద్రూరుఅను ఖసబాయందు వ్యవసాయాభివృద్ధికై మజర, (Agricultural form) నొకదానిని స్థాపించియున్నారు, ఈ మజర, కొఱకై మూడులక్షలరూపాయలు ఖర్చు అయినవి. దీని ముఖ్యోద్దేశమేమనగా రియాయాకు అన్నివిధములైనకాపుదనములోని నూతన శాస్త్రీయపద్ధతులను నేర్పించుటయే! పలురకములైన వ్యవసాయపు పనిముట్లు ఇనుముతో చేయబడినవి ఉపయోగించెదరు నానావిధముల గు చెఱుకువిత్తనములను నాటుచున్నారు అందు కోయంబత్తూరు చెఱుకు విత్తనము ప్రసిద్ధిచెందినది దీనికి కాయ్యకట్ట వలసినపనిలేదు. ఈవిత్తనము నాటినవారికి సాలుకు యున్నూట యేబది (౧౫౦) రూపాయలు ఆదాయము యెక్కువవచ్చుచున్నది వ్యవసాయములోని యీ నూతన శాస్త్రీయపద్ధతులను ఆచరణలో పెట్టుటకు కాపులు భయపడకూడదు. ఏవిలాభకరమైనవో వాటినైనను తెలుసుకొని ఆచరించుచుండవలెను. ఇతరదేశీయులు మనకన్న యెక్కువధనవంతులుగానుండుటకు కారణము వారు తెలివిగలవారై నూతన పద్ధతులను ఆచరించుచుండుటవలననేకదా!

పైన వివరించిన సహాయములేగాక సర్కారువారు ఇతరదేశములలో వ్యవసాయదారులు ఒకశిరిస్తానుంచి పొందుచున్న మితములేని లాభమును చూచి, తమ దేశపు వ్యవసాయదారులుగూడ ఆదేవిధముగా లాభమును పొందుటకై తమ దేశమందును అశిరిస్తాను స్థాపించి తగినరీతుల పోషించుచు ప్రోత్సహించుచు వృద్ధిజేయుచున్నారు. ఈ శిరిస్తాను ఉర్దుభాషయందు, అంజుమన్ ఇమ్‌దాదు బాహిమీ, యనియు తెనుగున సహకారోద్యమ మనియు చెప్పెదరు. ఈ అంజుమన్ సంఘములు కేవలము రియాయా క్షేమాభివృద్ధికై పుట్టినవి. ఈ ఉద్యమమునందు సర్వమత సారమిమిడియున్నది. కేవు విచక్షణలేదు, స్త్రీ పురుష భేదములేదు, అందఱును సమభావముతో చూడబడుదురు. ఇహపరలోకసాధనమున కిదియే ముఖ్యమార్గము దీని ముఖ్యోద్దేశము లేవియన:—

౧ మితముగా ఖర్చుపెట్టుకొనునట్లు బోధించుట.

౨ లాభకరమైనట్టియు అవసరమైనట్టియు పనులకు మాత్రమే అప్పులనొసంగి కాపులను షాహుకారుల వడ్డీలలో నుండి తప్పించి వారి వ్యవసాయమును కాపాడుట.

ఈ సందర్భమున ముఖ్యముగా జ్ఞాపకముంచుకోవలసిన దేమనగా కాపులు నష్టదాయకమైన తమ పూర్వాచారములను పద్ధతులను పిచ్చినమ్మకములను వదలవేయవలయును. తన తాహతుమించి లగ్గములకును గృహములకును యిటువంటి యితరకార్యములకును పైకము ఎక్కువగా ఖర్చుపెట్టకూడదు.

౩ తనకుతాను సహాయము చేసికొనుటయేగాక తనతోడి హిస్సేదారులకుగూడ సహాయముచేయుట తన విధ్యుక్తధర్మమని తెలిసికొనుట. తెలిసికొనుటకై బోధించుట. ఎందుకనగా ఒక హిస్సేదారుడు యితరుల హిస్సేదారుల క్షేమముల నెప్పుడు గోరడో అప్పుడే తన క్షేమమునుగూడ నాశనము చేసికొనిన వాడగును.

సహకార శాఖవారు సర్వదా బీదరైతుల మంచివ్యాపారమునకు వ్యవహారమునకును సుఖ జీవనమునకును పాటుపడుచుందురు. ఇట్టి సద్ధర్మములతో గూడిన సహకారోద్యమ మహిమ మెండుగా మంచిగా గ్రహించునంతకాలము వారి బీదదశ ముమ్మాటికి బాగుపడదని నమ్మవలయును.

ఇన్నివిధముల పైకముచేతను, పలుకుచేతను పాటుపడుచున్న సర్కారు అలీ వారియందు కాపులు తమ కృతజ్ఞతను కార్యరూపమున వెల్లడించవలయును. సర్కారువారు తాము పాటుపడిన కష్టముల ఫలమంతయు తమ రాష్ట్రీయ ప్రజలే అనుభవించవలెననియున్నది. తమ దేశీయుల సుఖజీవనమందు వారికెంతయు అభిలాష మెండు ఇందుకొఱకై బెజవాడ, గుంటూరు, నెల్లూరు, బెంగుళూరు, మదరాసు మొదలగు అన్యదేశములనుండి బోధన్, నిజామాబాదు, ఆర్‌మూరు తాలూకాలలోని కుష్కీభూమిని తరీగా మార్చుటకుగాను నిజామాబాదు అవ్వల్ తాలూకాదారు గారికి వచ్చుచున్న మితిలేని దరఖాస్తులను మంజూరుచేయక ఆ విధముగనే ఆపివేసియున్నారు, నిజాంరాష్ట్రములోని ప్రజలీసంగతిని త్వరలో తెలుసుకొని హుషారు పొందవలయును. ప్రస్తుతము కుష్కీని తరీ చేయుట లాభముగా లేకున్నను ముమ్మందు కొన్నిసాలులు గడచినతరువాత చాల లాభదాయకముగానుండును. బెజవాడ పంజాబు ప్రాంతములందు క్రొద్దిసంవత్సరముల క్రిందట అక్కడ బేకారుగాపడియున్న భూములను కొన్నిలక్షలరూపాయలను ఖర్చుపెట్టి నీటి కాలువలద్వారా తరీచేసినారు, మొదట యెందుకు పనికిరానిభూములు యిప్పుడు అయిదునూర్ల రూపాయిలనుండి మూడువేలరూపాయల వరకును ఖరీదుకు కలిగియున్నది. కాబట్టి ముందాలోచన గలిగి ముందువచ్చులాభమును అపేక్షించువారు యిప్పుడే హుషారు పొందవలెను, సర్కారు వారికీ ముందువచ్చులాభమునందు నమ్మకముండుటచేతనే ఇతరదేశీయుల దరఖాస్తులనాపి తమదేశీయులకు కొంతకాలము గడువునిచ్చియున్నారు. సర్కారువారికీ యీగడువులలోపలనైనను తమ రాష్ట్రప్రజలు హుషారుపొంది దరఖాస్తులు పంపెదరేమోయని ఆశ. ఈ విధముగా ప్రభుత్వమువారు తమ దేశీయులపై నెక్కువమైన దయారసమును ప్రవహింప జేయుచున్నారు. వారు యింతకన్న అధికముగా దేశసేవచేయుటకు వీలులేదు. కావున భూమి యితరదేశీయులస్వాధీనమైన తరువాత దరఖాస్తులిచ్చిన ఏమియు ప్రయోజనముండదు. నీరంతయు ప్రవహించిన తరువాత నానకట్టిన చందమగును. సర్కారువారు కలుగజేసిన యీ మౌఖాను పైనజెప్పిన సకలవసతులను ఉపయోగించుకొనగోరు, బోధన్ నిజామాబాదు, ఆర్‌మూరు తాలూకాలలోని కాపులు తమ తాలూకాలలోని కుష్కీభూములను తరీగాచేసుకొని సుఖజీవనముచేయుదురని నమ్ముచున్నాము. లేనిచో అన్యదేశీయులకు ప్రభుత్వమువారు తమ భూములను విచారములో నియ్యవలసివచ్చును. ఇటువంటి మంచి మౌఖాను కలుగజేసి కావలసిన అనేక సహాయముల నిచ్చుచున్న దయామయులగు మన H. E. H. నైజాము సర్కారు అలీ వారియందు నిజాంరాష్ట్రప్రజలు తమ కృతజ్ఞతను కార్యరూపమున వెల్లడించుచు వారి చిరతరారోగ్య సంపదాభివృద్ధికై సర్వేశ్వరున్ని సదా ప్రార్థించుచుండవలయును.

---

# క్షయరోగము

(రావి నారాయణరెడ్డిగారు)

[ గత సంచిక తరువాయి )

క్షయరోగి ఎప్పుడు పిల్లలను ముద్దిడకూడదు మరియు అతడు ఇతరులు భుజించు ఆహారమును తగుల గూడదు. సాధ్యమైనంత వరకు రోగిగదియందు ఈగలు లేకుండ జేయవలయును. ఏవిధముగనైన ఈగలు తెమడపైన వ్రాలకుండ జేయవలయును తెమడపాత్ర ఎల్లప్పుడు మూసియుంచవలయును.

రోగి సంతోషముగా నుండుట ఆరోగ్యమునకు ముఖ్యము. క్షయరోగి దైవముపైన భారము వేసిన ఎంతయో లాభము చేకూరును. నిరాశజెంది మరణింతునని కంగారుపెట్టుకొనిన తప్పకమరణించును.

డాక్టరు పరీక్షించి వ్రాసియిచ్చిన మందుతప్ప ఇతరమందులువాడకూడదు. కాడులివర్ ఆయిల్ క్షయరోగమునకు మంచిలాభకారిగా పరిగణింపబడినది. చాలవరకు దానిని మాల్టువకుస్త్రాక్టు ( ) తో గలిసి ప్రతిదినము భోజన సమయములయందు మూడు పర్యాయములు భుజింపవలయును.

రోగి ప్రతిదినము బైలుకు వెళ్ళుటముఖ్యము గిన్ని మనందు చెడుపదార్థమునంతయు గడుగునందులకు ప్రతిదినము ఎన్నియో జాంబులనీరు త్రాగవలయును.

తెమడయందు నెత్తురు మిశ్రమమై యున్న రోగి మిగుల జాగరూకతతో నుండవలయును. రోగి ఏదైన బరువు ఎత్తుటవలనను, లేక జోరుకుగా నటునిటు తిరుగుటవలన, నెత్తురు వచ్చుటకు కారణభూతమగును. రోగి నెత్తురు ఎక్కువగానోటినుండి బడవేయుచున్న రొమ్మున, బరఫునీరు యందు ముంచిన బట్టలు వేయవలయును. బట్టలు తరచుగా తడుపుచుండవలయును. బరఫుదొరకనితీరుకు, చల్లటి నీటియందు ముంచివేసిన జాలును.

క్షయరోగముచే బాధపడి బాహ్యముగా ఆరోగ్యులుగా నగపడువారు చాల జాగ్రతగా నుండవలయును. రోగము తిరిగి ఎన్నడైనను రావచ్చును; గావున మిగుల జాగరూకతతో తమ శరీరములను గాపాడుకోవలయును. మరియు ఈవ్యాసమునందు వ్రాయబడిన అన్నివిధములచే, రోగముచే తప్పించుకోవలయును.

---

# సింధునది పొంగి వఱద వచ్చుచున్నది

పెద్దమంచుకొండకరిగి షియాకుడాము తెగిపడె

దిగువగ్రామముల ప్రజలు హెచ్చరింపబడిరి.

షియాకువద్ద నున్న ఆనకట్ట తెగినదనియు వఱదలు వచ్చుచున్నవనియు లేహనుండియును, స్కార్డూనుండియును తంతివార్తలువచ్చుచున్నవి. పెద్దమంచుకొండకరిగి వెల్లువలై వచ్చుచున్నదని చీఫ్‌యింజనీరు బికెట్టుగారు తెలియజేసిరి. ఈ హిమశైలము జులయి 11వ తేదిని 3 గంటలకు కఱగి క్రిందికి దొర్లినదట. స్కార్డూవద్ద యిదివరకు 14 అడుగులు నీరుండెను. ఇప్పుడు 33 అడుగుల నీరువచ్చెను. ఈ నెల 13 తేదీ ఉదయము వఱదలు అట్టాకువంతెన వద్దకు రాగలవు.

1929 సంవత్సరములో యిదే ప్రకారముగా నొకమారు వఱదలు వచ్చియుండెను. అప్పుడు దిగువనున్న సింధురాష్ట్రములోని గ్రామములు కూడా చాల కొట్టుకొని పోయియుండెను.

1929 సంవత్సరములో యీ వఱదలు అగస్టు నెలలో వచ్చెను. కాని యీసంవత్సరము ఒకనెల ముందుగానే వచ్చెను. 1929 సంవత్సరములో వఱదలు వచ్చినప్పుడు స్కార్డూవద్ద నీరు 17 అడుగులనుండి 42 అడుగులకు హెచ్చెను. అట్టకు వంతెనవద్ద 27 1/2 అడుగులనుండి 56 అడుగులకు హెచ్చెను. కాని యీ సంవత్సరము స్కార్డూవద్ద 24 అడుగులనుండి 32,4 అడుగుల వరకును హెచ్చెను. ఈ సంవత్సరము అట్టకు వంతెనవద్ద 27 అడుగులనుండి 40 అడుగులవరకును హెచ్చగలదు.

స్కార్డూవద్ద 32,4 అడుగుల నీరు మాత్రమే యుండినప్పటికిని, అట్టకు వంతెనకు పైభాగమందు అధికవర్షముకురిసెను. కాని ప్రస్తుతము సింధురాష్ట్రమునకు హానికలుగునను భయములేదు. సింధునదీ సమీపమునున్న దిగువ గ్రామముల వారిని గవర్నమెంటువారు ముందుగా హెచ్చరించుచున్నారు. ఇంతవరకును గ్రామములకు వరదనీరు తగులలేదు.

కుర్షెదు బేను గారి అనారోగ్యము
మేయో ఆస్పత్రికి మార్చుట

లాహోరులో కుమారి కుర్షెదు బేనుగారు దాదాభాయి నౌరోజీగారి మేనగోడలు, స్త్రీలజైలులో శిక్ష ననుభవించుచున్నారు. అపెండిసిటీసు ఉన్నదని అనుమానముచే మేయో ఆస్పత్రికి మార్చబడెను. కర్నలు భరూచాగారు నేడు అవసరమగుచో శస్త్రచికిత్స చేయుదురు.

ఆర్డినెన్సు పరిపాలనను ఖండించుటకు సభ

ఢిల్లీ పురప్రముఖుల విన్నపము

ఆర్డినెన్సు పరిపాలనమును ఖండించుటకుగాను జూలై 17 ఆదివారమునాడు జరుగుసభకు ఢిల్లీ పౌరులందరును రావలెనని కోరుచు 40 మంది ఢిల్లీపురప్రముఖులు విన్నపము గావించిరి. వీరిలో ఢిల్లీమునిసిపాలిటీ ఉపాధ్యక్షుడగు హరిశ్చంద్ర, హాఫీజ్, అబ్దుల్ అజీజ్, మహమ్మద్ సిద్దిక్ భిషన్‌సాహేబ్, (మునిసిపల్ కమీషనర్లు) బోసు, శివనాథు, నవలకిషోర్ గార్లుకలరు. ఆర్డినెన్సుల వలన దైనిక జీవనము, వర్తకవ్యాపారములు చాల నష్టపడినవని వారు తెలుపుచున్నారు.

అసిస్టెంటు పొలిటికలు ఆఫీసరును
హత్యగావింప యత్నించుట

సరిహద్దు రాష్ట్రములోని చరచినారులో నున్న పొలిటికలు ఆఫీసరు అగు జరీఫ్‌ఖానుగారు తమ యింటిముందు వసారాలో కూర్చుండియుండగా నొకబాంబు విసరివేయబడెను. కాని అదృష్టవశమున అది ప్రేలలేదు. గత శుక్రవారము యిది జరిగెను. అనుమానింపబడిన యిద్దరు అరెస్టు చేయబడిరి. దరియాప్తు జరుగుచున్నది.

# ఐరిషు దిగుమతులు

ఐరిషు ఫ్రీస్టేటు ప్రభుత్వమువారు తమ అత్యవసర శాసనముచే ఇంపీరియలు ప్రిఫరెన్సు తొలగించెదరట. గ్రేటు బ్రిటనునుండి వచ్చు కొన్ని దిగుమతులపై సుంకములను విధించెదరని తెలియుచున్నది. ఈవారాంతములోపుగ డెయిలు పార్లమెంటు వేసవి సెలవులకు విరమించులోపుగ ఈ శాసనమును ఆమోదించెదరు.

బ్రిటిషు ప్రభుత్వ ప్రత్యేకసుంకములు

శుక్రవారమునుండి ఐరిసు ఫ్రీస్టేటు దిగుమతులపై బ్రిటను ప్రత్యేక సుంకములను విధింపనుండుటచే అలజడి బయలుదేరెను. శుక్రవారములోపుగ పశువులు, గొఱ్ఱెలు, పందులు, కోడిగ్రుడ్లు వెన్నను విస్తారముగ ఎగుమతి చేయుచున్నారు. బండ్లలోవేసి రేవులగ్గరకు గొంపోబడెను. అదనపు నౌకరులను గూడ వేసిరి.

ఐర్లాండు ఫ్రీస్టేటు ప్రభుత్వము గ్రేటుబ్రిటను నుండి దిగుమతియగు సరకులపై సుంకములను విధించుటకు కార్యనిర్వాహకసభ కావశ్యకమగు అధికారము నిచ్చిరి. ఇంత మొత్తము విధించవలెనని నిర్ణయించలేదు, స్టాంపుపన్నునుకూడ కొన్ని కాగితములపై విధించవలెననిరి.

# ఇంగ్లాండు: అయిర్లాండు

సెనెటుసభచే నామోదింపబడిన
ప్రమాణము బిల్లులోని సవరణలు
తిరస్కరింపబడుట

లండను, జూలై ౧౨:—

నేడు దిగువ సభలో ప్రమాణముల బిల్లును గూర్చి తీవ్రముగ చర్చ జరిగినది. "సెనెటులో ఆమోదింపబడిన సవరణల నన్నిటిని యెదిరించుచున్నాను" అని డివాలెరాగారనిరి. సెనెటులో చేయబడిన సవరణకు అనుకూలముగా [illegible] మందియును ప్రతికూలముగా [illegible] మందియును వోటుచేసిరి. కాన సెనెటుసవరణ తిరస్కరింపబడెను. ఇపుడు యీబిల్లు మరల సెనెటుకు పంపబడును. అపుడు వారు దీనిని తిరస్కరించెదరనియే అందరును తలచుచున్నారు. అపుడు డివాలెరాగారు మరియొక ప్రయత్నము చేయనిచో ౧౮ నెలల వరకును అది అమలులోనికి రాజాలదు.

అయిర్లండు సరుకులపైన పన్నులు
యీనెల ౧౫ వ తేదీనుండియు
వసూలుచేయబడును

"అయిర్లండు దొరతనము వారి వద్దనుండి మరల నెట్టి ఉత్తరమును రాకపోయినను సుంకముల చట్టమును అమలులో పెట్టుటకు దొరతనమువారు నిశ్చయించిరని పార్లమెంటు సభలో థామసుగారు తెలిపిరి. మాంసార్థముకొరకు పంపబడిన బ్రతికియున్న జంతువులు యితరపనుల నిమిత్తము పంపబడిన బ్రతికియున్న జంతువులు, వెన్న గ్రుడ్లు, మీగడలు, పరిమితిమీరిన కోటుజంతువుల మాంసము ఆవుల మాంసము యితర రకముల మాంసము వీటిపైని యీనెల ౧౫ వ తేదీ గురువారమునుండి ౧౦౦ కి ౨౦ వంతున పన్ను వసూలు చేయవలెనని ప్రభువారు ఉత్తరువు చేసిరి.

విచారణ సంఘమును గూర్చి
డివాలెరాగారు సూచించుట

"ఇంగ్లాండు అయిర్లాండు దేశముల వివాదము పరిష్కరించుటకు ఏర్పరుప బడవలసిన విచారణ సంఘమునందలి సభ్యుల వ్యక్తిత్వమును గూర్చియును విచారణ చేయదగిన విషయములను గూర్చియును బ్రిటిషు వారికిని మాకును సమాధానము కుదిరినచో దానిని అయిర్లండు పార్లమెంటుచే యామోదింపవలసి యున్నచో సంయుక్త వేసవిలో డయులు సభ జరుపబడును. ఈ సమస్య సాధ్యమైనంత త్వరలో పరిష్కరింపబడవలెననియే నేను కోరుచున్నాను" అని డివాలెరాగారనిరి. (రాయిటరు)

# డివెలెరా మాక్డనాల్డుగార్లు

సంభాషణలు నిష్ఫలమగుట

డివెలెరా మాక్డనాల్డు సంభాషణలు నిన్నరాత్రి ౧౧ గంటలకు ముగిసినవి.

ఈ విషయమై ప్రభుత్వమువారి క్రింది ప్రకటన గావించుచున్నారు:—

"డివెలెరాగారు ప్రధాన మంత్రిగారు జరుపుచున్న సంభాషణలయందు సాంకీ ప్రభువుగారు సర్ ఇన్‌స్కిప్పుగారు పాల్గొనిరి. రెండు దేశముల ప్రస్తుత సంబంధములను గురించి చర్చజరిగెను. కాని ఇంతవరకు గావింపబడిన ప్రకటనలయందు రెండుదేశముల ప్రభుత్వములవారు సూచించిన విధానములను మార్చుకొనుటకు ఉభయ పక్షములవారు అంగీకరింప జాలక పోయిరి."

నేటిదినము ఉదయము డివెలరాగారు డబ్లినుకు మాక్డనాల్డుగారు లాసిమత్తుకును ప్రయాణమయి వెళ్లిరి.

డివెలెరాగారి కార్యదర్శి రాయబారములు చెడుటకు కారణములో నిటుల తెలియచేసిరి. చర్చలకు పూర్వమున్న పరిస్థితులే ఇపుడుకూడ ఏర్పడెను. బ్రిటను, ఐరిషు, ఫ్రీస్టేటుల నుండి చేరి ఇద్దరు ప్రతినిధులు రాయబారములను తమలోతాము జరుపుకొనవలెనని సూచింపబడెను.

కాని దీనికి ముందుగ భూమి మొత్తములను ఇవ్వవలెనని బ్రిటిషువారు నిర్బంధము చేసిరి. కాని ఈ షరతును డివెలెరాగారు అంగీకరించలేదు.

ఈ రాయబారములలో ముందు పాల్గొన్న సార్టనుగారు ఇట్లు తెలియచేసిరి:—గతరాత్రి చర్చలవలన బ్రిటనుపట్ల డివెలెరాగారు వహించిన వైఖరికి కార్మిక పక్షమువారు తోడ్పడెదరనుటకు సందియములేదు, ముందేమయిన రాయబారములు జరుగునను తలంపుతో డివెలెరాగారు భూమి మొత్తము సొమ్మును అమానతుగ తమ దగ్గరనే పెట్టుకొనిరి.

డబ్లిను డెయిలుసభవారు ఆమోదించుట

ఎమర్జన్సి ప్యూనిటివ్ బిల్లును డెయిలు సభవారు దీర్ఘముగ చర్చ జరిగిన పిమ్మట ఆమోదించిరి.

శ్రీమతి మీరాబెహనుకిక నోటీసు

శరణ్‌జిల్లానుండి 12 గంటలలో వెళ్లిపోవలెను
నెలవరకు రాకూడదు

బొంబాయి, జూలై 14:—

జబ్బుగానున్న బాబు రాజేంద్ర ప్రసాదు గారిని చూచుటకు శ్రీమతి మీరాబెను (స్లేడ్ కన్య) చాప్రాకు వచ్చెను. 12 గంటలలో శరణ్ జిల్లాను వదలి వెళ్లి పోవలయుననియు, నెలవరకు జిల్లాలో అడుగుపెట్టరాదనియు స్పెషల్ పవర్సు ఆర్డినెన్సుక్రింద శరణ్ మేజస్ట్రేటుగారు మధ్యాహ్నము 1 గంటకు ఉత్తరువు జారీచేసెను.

పి. లక్ష్మీపతి శాస్త్రిగారి కేసుతీర్పు

2 ఏండ్లు శిక్ష, రూ 100 జరిమానా

శ్రీయుత పెనుమర్తి లక్ష్మీపతి శాస్త్రిగారు మునిసిపలు సంఘసభ్యులు. శ్రీ ప్రెను ముస్నగు పత్రికాధిలేఖకులు, మచిలీపట్నం ప్రజాసంఘం కార్యదర్శి. నేడు హుజూరు సిరస్తెదారు ఎస్. రాజారావు నాయుడుగారిచే 2 ఏండ్లు కఠిన శిక్ష రూ 100 జరిమానా విధించబడిరి. శాస్త్రిగారు జిల్లాకోర్టులోను యవసరమయినచో హైకోర్టులోను అపీలుచేయనున్నారు.

## హోరుగారి కడపటి ప్రకటనపైన విమర్శనలు

సర్ తేజబహాదూర్ సప్రూగారి

ఖండనము

అలహాబాదు, జూలై 15—

"ఇపుడు ఇండియామంత్రి మరల పార్లమెంటులో నొసగిన యుపన్యాసమునుగూడ నేను చదివితిని. గత 15 రోజులలోను హోరుగారు పార్లమెంటులో యిండియానుగూర్చి ముమ్మారు ఉపన్యసించిరి. ఇది మూడవ ప్రసంగము. తన క్రొత్త సూచనలను సమర్థించుటకు హోరుగారు అధిక ప్రయత్నము చేయుచున్న కొలదియును నావంటి భారతీయులకు నమ్మకము కలుగుటకు అవసరములగు కారణములు మరింత తొలగిపోవుచున్నవి. ఈ క్రొత్త పద్ధతివలనత్వరలో వ్యవహారము నెరవేరునని తలచుటకు నాకెట్టి ఆధారమును కనపడదు.

ప్రభుత్వ విధానమును భారతీయులామోదించుట కల్ల

"దొరతనమువారి విధానమును ఆమోదించినవారు భారతదేశములో మిక్కిలి హెచ్చుమంది కలరు." అని యిదివరలో నిండియామంత్రి పదవిలో నున్నవారు చాలమంది తెలిపియున్నారు. ఇకముందు ఆపదవికి రాగలవారు చాలమందిగూడ నటులనే తెలుపగలరు. గాన నీవిషయమును నేను హోరుగారొక్కరే క్రొత్తగా తెలుపలేదు.

భారతీయుల సహకారమును తిరస్కరించుట

నా క్రొత్తవిధానమును భారతీయులలో అత్యధిక సంఖ్యాకులు ఆమోదించిరి. అని హోరుగారు యిపుడు తెలుపుటవలన తన విధానము నామోదింపజాలని వారి సహకారమును హోరుగారు తిరస్కరించుచు "మీరేమి చేయగలరో చేయుడు" అని సవాలువేసెను. ఈ సవాలుకు భారతీయు లియ్యగల ప్రత్యుత్తరమునుగూర్చి నాకెట్టి సంశయము లేదు. ఈతడిపుడు దీనిని గూర్చి బలికిన యీవాక్యము లన్నియు వట్టి డాంభిక ప్రగల్భోక్తులే యని త్వరలోనే నిర్ధారణ కాగలదు.

హోరుగారు యెవరి సహాయముపై నాధారపడుచున్నారు?

ఇపుడు హోరుగారి విధానము ననుసరించి యేర్పరుప బడునట్టి రాజకీయ విధానము నమలు జరుపుటకు హోరుగారు భారతదేశమునందెవరి సహాయముపై నాధారపడుచున్నారు? ఇపుడు ఎవరో కొంతమంది హోరుగారికి వెనుక తాళమువేయుట నిశ్చయమేగాని చట్టము ఆమోదింపబడిన పిమ్మట దాని నమలుజరుప నారంభించినపుడే వారికి గల పలుకుబడి యొక్క గుట్టువెల్లడియగును.

కన్సర్వేటివుల ప్రతికూల్యము

ఈ రీతిగా భారతీయులును బ్రిటిషువారు కలసి యోచించి భారత రాజ్యాంగ విధానమును నిర్ణయించుటకు కన్సర్వేటివులు మొదటినుండియు ప్రతికూలముగానే యుండిరి. ఇటీవల చర్చిలుగారు పార్లమెంటు సభలో చేసిన ప్రసంగము నిది మరింత స్పష్టమగుచున్నది.

త్వరలో పరిష్కారము జరుగునా?

"ఈ మార్పువలన త్వరలో పరిష్కారము జరుగును." అని హోరుగారు విరామములేకుండ తెలిపిరేగాని అది యెటుల సాధ్యమగునో స్పష్టముగా నెచటనుగూడ తెలిపియుండలేదు.

సలహా సంఘమువారి సమావేశములు సెప్టెంబరు నెలాఖరునకుగాని ముగియవు. అటుపిమ్మట దొరతనమువారిచే నాహ్వానింపబడిన అల్పసంఖ్యాకులగు భారతీయులు ఇంగ్లాండుకు బయలుదేరి అచట పార్లమెంటరీ కమిటీతో నాలోచింపవలెను. ఇది నవంబరు నెలలోగాని జరుగదు.

మేము హక్కులను వదలుకొనజాలము

దొరతనమువారు చట్టమును సిద్ధపరచిరని యే తెలియుచున్నది. లేదా అది సిద్ధముగా నున్నదని యే తలచినను గూడ వెంటనే తక్కువ సంఖ్య గల సభ్యులతో గూడిన రౌండుటేబిలు సభను జరిపినయెడల మాత్రము ఇంతకంటె నధికమగు నాలస్య మెటుల కలుగును? ఆలస్యము జరుగవలెనని మేము కోరుటలేదుగాని పరిష్కారము త్వరగా జరుగుటకొరకు మా హక్కులను మేము వదలుకొనజాలము. మేము హోరుగారి సూచనలకు సమ్మతించుటవలన మాకు గలుగగల మహాద్భాగ్యమేమి? రాష్ట్రీయ స్వపరిపాలనము మాత్రమేనా మరేమయిన నున్నదా?

కన్సర్వేటివుల పట్టుదల

"1935–36 సంవత్సరములలోగా పెంటరులో నెట్టి బాధ్యతను నెలకొల్పగూడదు." నిట్టి కన్సర్వేటీవులు గట్టి పట్టుదలతో నున్నారని నేను లండనులో నున్నపుడే నాకు తెలిసినది. నిన్నటి పత్రికలలో వెలువడిన బెంగాలు చేంబరుఆఫ్ కామర్సు సంఘమువారి తీర్మానమును ఎల్లవారును ముఖ్యముగా చదువగోరెదను. వారికి దొరతనమువారి రహస్యములు బాగుగా తెలిసియుండును. గానన వారికిగూడ 1935, 1936లోనే ఫెడరేషను నేర్పడగలదని సూచించిరి.

గాంధిగారి సహకారమును హోరుగారు కోరుచున్నారా?

"గాంధిగారును కాంగ్రెసువారును సహకారము చేయకపోవుట దీనికొక కారణము." అని తెలుపుటలో హోరుగారి ఉద్దేశమేమో నాకు సరిగా బోధపడలేదు. హోరుగారికి గాంధిగారి సహకారము కావలెనా లేక అక్కరలేదా? కావలసినచో దానిని బడయుటకు హోరుగారెట్టి ప్రయత్నములనైన జేసియున్నారా? గాంధిగారి సహకారము హోరుగారి కక్కరలేనిచో యిపుడీ మాటలు [illegible]?

## సర్ పురుషోత్తమదాసు ఠాకుర్దాసుగారు

గాంధిగారిని వెంటనే విడుదలజేసి, వారితో రాజీ పడవలెను

బొంబాయి జులయి 15:—

"ఆర్డినెన్సుల వలననే దొరతనమువారిపుడు భారతదేశమున పరిపాలన సాగించుచుండుటచే నిపుడు రౌండుటేబిలు సభను జరుపుటకుయిందులకు విరుద్ధముగా నుండునని హోరుగారి అభిప్రాయమా?

గాంధిమహాత్ముడు స్టేటు ప్రిజనరుగాని ఆర్డినెన్సుల నుల్లంఘించినందులకు శిక్షింపబడియుండలేదు. కావున రౌండుటేబిలు సభను మరల జరుపునెడల గాంధిగారా సభకు వెళ్లవలసియుండును, అందులకు దొరతనమువారు గాంధిమహాత్ముని విధిగా వదలవలసియుండును, గాంధిమహాత్ముడు కాంగ్రెసుకు ప్రధాన నాయకుడను విషయము లోకవిదితము. కాంగ్రెసువారితో రాయబారములను జరుపగూడదని బ్రిటను దొరతనమువారును ఇండియా దొరతనమువారును గూడ నిశ్చయించుకొని అటుల ప్రకటించియున్నారు. ఈరీతిగా కార్యనిర్వాహక వర్గమువారియుత్తరువు ననుసరించి గాని, దొరతనమువారికి సరియని తోచిన కారణముల వలన గాని భారతదేశైక నాయకుని కారాగృహబద్ధుని గావించి యుంచినపుడు తాము చేయునట్టి రాజ్యాంగ చట్టమును భారతీయులామోదించెదరని హోరుగారు తలచుచున్నచో అది వట్టి దుర్భ్రమ యని హోరుగారిపుడైనను తెలిసికొందురుగాక.

ఈసారి మరల హోరుగారు చాల శ్రమపడి ఉపన్యసించిరిగాని భారతీయుల కిందువలన నెట్టి సంతృప్తియును కలుగలేదు. తన విధానమునకు చాల అనుకూలముగా నుండుటకే హోరుగారు రౌండుటేబిలు పద్ధతిని మార్చిరని భారతీయులందరును గూడ భావించుచున్నారు. ఇపుడు పార్లమెంటులో కన్సర్వేటీవుల సంఖ్య అత్యధికముగా నుండుటచే హోరుగారిటుల చేయుటలో నెట్టి అబ్బురమును లేదుగాని అంతమాత్రమున నీమార్పు సరియైనది కాజాలదు. భారతీయులు దీని నామోదింపజాలరు" అని సర్ పురుషోత్తమదాసుగారు తెలిపిరి.

---

## దక్కన్ మానవసేవాసమితి

సికింద్రాబాదు

మానవసేవయే తనముఖ్యధర్మముగ నెంచి యీసమితి యీ పట్టణంబున చిరకాలమునుండి సార్థకనామమై పనిజేయుచున్నది. బాలురవిద్యాభివృద్ధికొరకేమి, నిమ్నజాతులగు ఎరుకలయిత్యాదులకు ప్రాథమిక విద్యానొసంగ పాఠశాలల స్థాపించియేమి, అనాథ ప్రేతసంస్కారములందేమి, పశుపక్ష్యాది హింసాకార్యముల ధర్మములని ప్రచారము సల్పుటయందేమి, యగ్రస్థానము వహించి నిరంతర కృషిసల్పుచున్నది. ప్రతివత్సరము ఆషాఢ మాసమునందున పట్టణమున జరుగుచున్న ఘోరహింసా పూర్వక మహాకాళీ జాతరయందు "అహింసా" ప్రచారము గావించి దేవీపూజ సాత్వికపద్ధతులపై జరిగించుటకు నలయు [illegible] తోపముసేయక [illegible] [illegible] నగర [illegible] ప్రచారము సాగించుచున్నది. ప్రజలలో నీయహింసా ప్రచారము [illegible] కేవలయార్యసామాజికులను [illegible] వ్యాపించియున్నది. [illegible] కేవలము పొరబాటు. ఒక ఆర్యసామాజికులే అహింసాప్రచారకులా! అహింసాప్రచారము మానవుని ముఖ్యధర్మము. హిందూమత సాంప్రదాయములందు సువర్ణాక్షరములచే లిఖింపబడి శృతిస్మృతి పురాణేతిహాసములయందు తనదివ్య ప్రభాపుంజములచే వెలుగొందుచు నార్యఋషి సంతానమగు మనలచే నత్యంత పూజనీయముగ భావింపబడు "అహింసాపరమోధర్మః" యను యుత్కృష్టధర్మము కేవల మార్యసామాజికులదా? హిందూపదవాచ్యులగు సర్వ

లదీ య్యహింస. అట్టి దురభిప్రాయమును ఖండిం చుటకే శ్రీమాన్ కే. తాతాచారిగారు (మానవసేవాసమితి అధ్యక్షులు) శ్రీయుత పోలం వీరయ్య యాదవగారు (నిజాంరాష్ట్ర యాదవమహాజన సంఘకార్యదర్శి) శ్రీయుతులు య్యం. శంకరయ్యగారు కాలేరు శ్రీరాములుగారు, వి. కృష్ణమూర్తిగారు, ఆర్. కే. వి, మొదల్యార్ గారు యిత్యాదులు పలువురు పెద్దమనుష్యులు సమితి సభ్యులతో సహా బయలుదేరి నగర సంకీర్తనము గావించి "అహింసా" ప్రచారమును గావించియున్నారు. మ॥ రా॥ శ్రీ చీకోటి వీరన్న శ్రేష్టిగారు, మ॥ రా॥ శ్రీ చందా నారాయణ శ్రేష్టిగారు మాయుద్యమమునం దభిమానముంచి, అహింసా ప్రబోధకమగు నొక గ్రంథమును, కరపత్రములను, క్రమముగా నుచితముగా నచ్చొత్తించి సాయపడియున్నారు. వారికి మేమంతయు కృతజ్ఞులము. దేవాలయములముందర పశువిసనము హేయముగా పరిగణింపఁబడునీకృత్యము నాచరించుటలో కేంద్రస్థానమగు నీ సికింద్రాబాదునందు మానవసేవాసమితి యత్యంత కృషిసల్పి యీ హేయకృత్యమును కొంతవఱకు మాన్పగల్గినదను టకెంతయు సంతసముగానున్నది. ఇట్టి కార్యమునకై స్థాపింపఁబడిన జీవరక్షా ప్రచారక మండలి వారు తమ భజనమండలి నొసంగి సమితి కెంతయు దోడ్పడియున్నవారలు. వీరికి సమితి పక్షమున మేమెంతయుఁ గృతజ్ఞులము. కేవల అహింసా ప్రచారమునకయ్యే స్థాపింపఁబడిన జీవరక్షా ప్రచారకమండలివారు, సికింద్రాబాదునందు జరుగుచున్న యీ ప్రచారమునకుఁ గేవలము భజనమండలి యొసంగుట తోడనే సంతృప్తిఁ జెందక తమ ప్రచారకనిధినుండి కొంతధనమును యీ సమితి గావించు నీ యుత్కృష్ట పారమార్థిక ప్రచారమునకుఁ గూడ నొసఁగి కృతకృత్యులు గాగలందులకు ప్రార్థించుచున్నాఁడను. ఈసికిందాబాదు నందేగాక, అమ్ముగూడ, రామకృష్ణాపురం, తిరుమలగిరి, పిక్కటు యిత్యాది ప్రాంతములయందుఁగూడ జరుగు నీ ఘోరహింసా పిశాచమును నిర్మూలింపఁ బ్రచారముగావించు నీసమితికి, జీవరక్షా ప్రచారక కార్యనిర్వాహకులు తాముచేయనున్న కార్యమునందుఁ బాల్గొనిన నీసమితికి, తమ నిధినుండి ధనరూపసాహాయ్యము గూడనను గ్రహింపఁ బ్రార్థించుచున్నారము. గ్రామస్థులు సమితి గావించు నీ యమూల్య కార్యమును మదినెంచి, యిది కేవల మొక తెగకుఁ జెందినది గాదని యెఱింగియుండు సభ్యులుగఁజేరి మాకు చేయూతనొసంగఁ బ్రార్థించుచున్నాఁడను.

డి.యం.యస్.సమితి కార్యస్థానము
దే. 17-7-1932

ఇట్లు
ఏ. వి. రత్నాత్రేయశర్మ
కార్యదర్శి

## సూర్యాపేటతాలుకా రైతుల మొర

ఆలీజనాబు నవాబ్ సర్ హైదర్ నవాజు జంగు బహాదురు సదరుల్ మహాం ఫైనాన్సు వ రైల్వేగారి దివ్యసన్నిధికి:—

మనవి యిదికదా రైల్వేబస్సు ప్రారంభింపబడుటకు పూర్వము, మారైతు పోకలయందును, వస్తువులు తెచ్చుకొనుటకు కొనిపోవుటకును మాకు చాలినన్ని సౌకర్యములుండెను. రైతుల సర్వసులను అపహరించేయుటమా సౌకర్యములను కోల్పోవుతచేయుట మైయున్నది.

ఈ రైల్వేబస్సులలో మేము మాసామానులను స్వయముగా మేమే యెక్కించి దించుకొనుటయేగాక కిరాయగూడా హెచ్చుగా యియ్యవలసి వచ్చినది. అనగా ౧౪ మైళ్ల ప్రయాణమునకు ౦-౭-౦ ఏడు అణాలకు బదులు ౦-౧౨-౦ పన్నెండణాలు యిచ్చుకొనవలసి వచ్చినది. దారి మధ్యలో ఏవిధమగు అవసరమున్నను మోటారు నిలుపదు అవసరములపై మాకు ఇతర మోటారుబండ్లు దొరుకునట్లులేదు.

బీదలు చిలరవర్తకులు, కొన్ని వర్తకసామానులు హైదరాబాదునుండి, ఖమ్మంనుండి రైతు మోటారుసర్వీసులపై తెప్పించుకొనుట వాడుకయైయుండెను. ఆ చిల్లరసామానులమ్ముకొని బ్రతుకుచుండిరి. కాని ఇపుడా ఆధారము లేకపోవుటచే మాజీవితము కష్టదశలోనున్నది. అపుడు ఒకదినమున సంపాదించిన లాభము ఇపుడు నాల్గుదినములు పాటుపడినను దొరకుట దుర్లభమైనది. రైతు మోటారుబస్సులలో ఏయే సౌకర్యములుండెనో అవి ఇపుడులేవు. కావున మనవియేమనగా హైదరాబాదు నగరములో నున్నట్లునే పబ్లిక్ సర్వీసులుగూడా నడచు ఏర్పాట్లు నిలిపియుంచిన మాకష్టములు తొలగును. సర్కారువారు మామనవి యంగీకరింతురనినమ్ముచున్నాము. దీనిప్రతియొకపతము రహబర్, గోలకొండ, మన్షూర్, ముషీర్ దక్కన్, సహీఫా, పత్రికాధిపతుల సముఖమునకు పంపుచు, తమనేను పత్రికలయందు ప్రకటించుటకై విన్నవించుచున్నాము

ఇట్లు
రైతులు
తా॥ సూర్యాపేట జి. నల్లగొండ

## దక్కను ఆయుర్వేద వైద్యమండలి

విద్యాపీఠ సమాలోచనసభ

15-7-32 ఆషాఢ శు ౧౨ శుక్రవారము

౧ గత సభాచర్యలు చదివి వినిపింపబడెను.

౨ ఆదాయ వ్యయ లెక్కలు చదివి వినిపింపబడెను.

౩౦ రూ ఆదాయము
౩౧-౧౫-౬ వ్యయము
౧-౧౫-౦ అప్పులు తీసుకొనబడెను.

3 ఆయుర్వేద వైద్యపీఠ సభ్యులుగా నీక్రిందివారలు ఎన్నుకొనబడిరి.

౧ వైద్యాగ్ వైద్య హకీం నారాయణదాసుగారు
౨ పండిత భాల గోవిందదాసుగారు
3 బ్ర॥ శ్రీ ముదిగొండ బుచ్చిలింగం శాస్త్రిగారు కార్యదర్శి
౪ ,, సంగమేశ్వర శాస్త్రిగారు
౫ శ్రీమాన్ వేదాల తిరుమల రామానుజ స్వామిగారు
౬ పండిత్ మనోహరప్రసాదుగారు

౪ విద్యాపీఠ సభ్యులు సత్వరముగా సమావేశమయి పాఠశాలల విషయమును ఆలోచించి తీర్మానించవలయునని అధ్యక్షులకు కృతజ్ఞత సూచనానంతరము సభ ముగిసెను.

హకీం డి. జనార్దన
మండలి కార్యదర్శి

## బూరగంపాడు (వరంగల్ జిల్లా)

(స్వకీయ విలేఖరి)

గౌతమీ పుష్కరప్రవేశము

బూరగంపాడు షహరేవరు ౧:—

పావనగౌతమీపుష్కర ప్రవేశ సందర్భమున తీర్థవిధులకై యాత్రికులు తండోపతండములుగా కొత్తగూడెం(భద్రాచలంరోడ్డు స్టేషన్)నుండి బూర్గంపాడు—భద్రాచల తీరమునకుచేరి తమతమ విధ్యుక్త ధర్మాచరణ మొనర్చి వెడలిపోవుచున్నారు. భద్రాచలమునను రాజమహేంద్రవర మార్గమున గోదావరిపై స్టీంలాంచీలలో పెక్కండ్రు తీర్థయాత్రికులు వచ్చియున్నారు. వర్షము అధికముగా కురియుచుండుటచేతను కొత్తగూడెమునుండి బూర్గంపాడునకు వచ్చురోడ్డున రెండువాగులపై వంతెనలు లేనందువలనను అచ్చటచ్చట మోటారు బస్సులను మార్చుచు ప్రయాణము చేయవలసియుండుటచేతను ప్రయాణీకులు కిన్నరసానినదివద్ద సామానులను మోసికొని నదినిదాటి బస్సులలో స్థలముచాలక అనధికముద్దున బాధపడుచు నిరీక్షించుచుండుటవలనను యిబ్బందులకు లోనగుచున్నారు. దొరతనమువారు త్వరలో ఆయానదులపై వంతెనలను నిర్మింపజేసి(Railway out agency) స్థాపించినయెడల ప్రయాణసౌకర్య మింకను బాగుగా నుండగలదు. పెక్కుమంది ప్రయాణికులు బాడుగకుదొరకు యెడ్లబండ్లమీదను కాలినడకనుకూడ ప్రయాణము చేయుచుండిరి.

కాలస్థితి

ఈవారమున వర్షము అధికముగా గురియుచున్నవి. గౌతమియును, దాని యుపనదులును పూర్ణముగా ప్రవహించుచున్నవి. పునాస పైరులుకొన్నిచోట్ల బాగుగానే యున్నవి. దైవానుగ్రహమున జాడ్యములెవ్వియును లేక జనులు సుఖులై యున్నారు. అరణ్యమందలి పచ్చికను భక్షించుచు పశువులుగూడా బాగుగానే యున్నవి. వర్తకమాంద్యము వదలిపోలేదు. డబ్బుగిరాకీ, ధాన్యము చౌక, యీస్థితిగతులు యథాప్రకారమే.

విద్యావ్యాప్తి

సాధారణముగా నిచ్చటిప్రజలలో దమపిల్లలను జదివించునట్టి యభిలాష మెండు యీగ్రామము తాలూకా ప్రధాన స్థానములోనిది. అయినను యిది ప్రభుత్వమువారి పాలనం క్రింద తాలూకావారైతము బ్రధానస్థలమే యిచట ప్రభుత్వ కార్యాలయములు సంస్థాన కార్యాలయములు చాలాగలవు. విద్యాపోషకులగు శ్రీ నిజాం ప్రభుత్వమువారు యిచటిప్రజలపై కరుణించి యిచ్చట బాలురనిమిత్తమొక మొదటితరగతి ప్రాథమిక పాఠశాలయు హిందూ మహమ్మదీయ బాలికల నిమిత్తము వేర్వేరు బాలికా పాఠశాలలును, పదునైదు సంవత్సరములకు పూర్వమే పెట్టియున్నారు. ఈమూడు పాఠశాలలయందు ఎంతమందియో బాల బాలికలకు విద్యాదానము జరిగినది, జరుగుచున్నది. బాలుర ప్రాథమిక పాఠశాలయందిప్పుడు నూటడెబ్బదికి మించి విద్యార్థులున్నారు. యింక ప్రతిసంవత్సరము ప్రైమరీతరగతిని ముగించినవిద్యార్థులు మాధ్యమిక విద్యాభ్యాసమునకై, యిల్లెందు ఖమ్మం, ఓరుగల్లు మొదలగు దూరస్థ పాఠశాలలకు వెళ్లవలసి వచ్చుచున్నది. సాధారణముగా బీద విద్యార్థులు వ్యయప్రయాసములకు లోనై స్థలాంతరములకు వెళ్లి చదువలేక, వచ్చీరాని చదువుతో తెలిసీ తెలియని విజ్ఞానముతో యౌవనారంభ దశయందు దుర్వ్యసనములకు జిక్కి, నిరుద్యోగులై, వృత్తివిహీనులై నిరర్థక జీవులగుచు పెక్కండ్రు కడగండ్ల పాలగుచున్నారు. ప్రజలవిద్యాభిలాషను బట్టియు, విద్యార్థుల సంఖ్యనుబట్టియు, పరిస్థితుల ననుసరించియు గనిపెట్టిచ్చట నొక మాధ్యమిక పాఠశాలయుండుట యెంతేని యావశ్యకము ఈ గ్రామమునకేకాక భద్రాచలమును బ్రిటిషు బోర్డు ఉన్నతపాఠశాలకలదు. భద్రాచలము జనసంఖ్యయందు దీనిని మించినగ్రామముకాదు యిచట మాధ్యమిక పాఠశాలను స్థాపింపవలయునని శ్రీ ప్రభుత్వమువారికి ప్రజలొకప్పుడు విన్నవించియుండిరట అప్పుడు ప్రభుత్వమువారీ విషయమును గమనించి గ్రామము సమస్థానమునకు జెందినదగుటచేత, మాధ్యమిక పాఠశాలకగు సంవత్సరవ్యయములను కొంతభాగము మాత్రమీయవలసినదని సంస్థానమువారిని కోరియున్నట్లు వదంతి కలదు, విద్యావ్యాప్తికై బద్ధకంకణులగు మహోపకారము వహించిన ప్రభుత్వమువారు అనతికాలములో నిచట నొక మాధ్యమిక పాఠశాలను స్థాపించి ప్రజాశయమును పరిపాలించెదరుగాక.

## సన్‌లైఫ్ అస్యూరెన్సు కంపెనీ ఆఫ్ కనడా

### ౧౯౩౧ సంవత్సర నివేదిక

| | | | |
|---|---|---|---|
| అమలులోనుండు అస్యూరెన్సులు | ... | ... | రూ. ౮,౩౫,౯౧,౧౫,౭౫ |
| చెల్లింపవలసిన క్రొత్త అస్యూరెన్సులు | ... | ... | ,, ౧,౪౪,౬౪,౦౮,౮౦౭ |
| మొత్తము రివిన్యూ | ... | ... | ,, ౫౬,౬౦ ౧౮,౯౮౩ |
| మొత్తము వ్యయము | ... | ... | ,, ౩౯,౮౪,౮౫,౪౭౮ |
| పాలసీదార్లకు పేమెంటులాభములు (౧౯౩౧) | ... | ... | ,, ౭౫,౦౯,౬౪,౯౪ |
| ఈ అస్యూరెన్సు ప్రారంభించినది మొదలు పాలసీదార్లకు పేమెంట్లు లాభములు | | ... | ౧,౬౫,౪౭,౫౭,౬౦౬ |
| అధికము, సంభావ్యత, రిజర్వు | ... | ... | ౫,౭౫,౮౧,౩౬౭ |
| మొత్తము అప్పులు (చెల్లించిన కాపిటల్ స్టాకుకలసి | ... | ... | ౧,౬౫,౩౯,౧౧,౬౬౦ |
| అస్సెట్సు (౩౧ డిసెంబరు ౧౯౩౧) | | ... | ౧,౭౧,౧౭౯౩,౦౭౭ |
| ఫండ్సు | ... | ... | ౧,౬౩,౩౭, ౨౦ ,౪౪౭ |

"పాలసీదార్లకు లాభములు చెల్లించినవిగాని, నియమించినవిగాని. మొత్తము రు౭,౧౩,౦౯,౪౫౧లు లేక సంవత్సర మొత్తమాదాయములోని ప్రీమియం ౧౦౦కి ౨౦ కంటె హెచ్చని చెప్పవచ్చును. పై సంఖ్యలవలన, యీ నివేదిక చాలా బాగున్నది"

**అన్ని జిల్లాలలో సమర్థులగు ఏజంట్లు కావలయును.**

అన్ని వివరములకు:—

ఎ. కె. హరవ్
చీఫ్ ఏజంటు 2095 మర్కెట్ స్ట్రీటు సికింద్రాబాదు

## స్వదేశీ స్టేషనరి కావలయునా?

అన్నిరకముల స్వదేశీ కాగితములు మస్టార్ అఫు ఇండియా కెప్పర్లును, ప్రింటింగు ఇంకులు, మాకు ఎల్లప్పుడు షాపులోనుండును, వ్యాపారస్థులకు మాప్రత్యేకముల్పై వారి పేర్ల అచ్చొత్తించి యిచ్చెదము. పాఠశాలలనుండి జిల్లాల నుండివచ్చు ఆర్డర్లను జాగ్రత్తగా విచారించెదము ఉత్తరప్రత్యుత్తరములు ఇంగ్లీషులో జరుపవలెను.

ది దక్కన్ కర్ణాటక స్కూల్ కో జిల్లా
(మద్రాసు పెన్సిళ్లకు ఏజంట్లు)
గౌలిగూడ, హైదరాబాదు.

## కొలంబియన్ ప్రెస్

మావద్ద కొలంబియన్ ప్రెస్ విక్రయమునకు సిద్ధముగానున్నది. మంచి స్థితిలో నున్నది. చిన్నముద్రాక్షరశాల కుపయోగపడును. కావలయున్నగు వివరములకై దిగువ వారికి వ్రాయుడు.

మేనేజరు
గోలకొండపత్రిక
౧౯౦౯ త్రూపుబజారు
హైదరాబాదు

## డోంగ్రేగారి బాలామృతము

ఉపయోగించుట వలన

బలహీనతను
పోగొట్టును

బిడ్డలకు బలమునిచ్చు

ఆరోగ్యము కలిగించును
ఒక బుడ్డీ వెల ౧ రూపాయి

పళ్ళు వచ్చులప్పుడు అజాలు

ఎల్ల షాపులందును దొరకును

K. T. DONGRE & Co.

GIRIGAUM, BOMBAY

## హిందువుల పండుగలు

(గ్రంథకర్త)
సురవరము ప్రతాపరెడ్డిగారు బి. ఎ. బి. ఎల్
౩౨౦ పుటలు ౬ చిత్రపటములు
జగద్విఖ్యాతి పండితులగు డాక్టర్ సర్. యస్. రాధాకృష్ణగారు మెచ్చుకొని యుపోద్ఘాతము వ్రాసియున్నారు
వెల ౧—౮—౦
మేనేజర్. గోలకొండ పత్రికా కార్యాలయము త్రూపుబజారు హైదరాబాదు

## అమృతాంజనము

అన్ని నొప్పులకు దివ్యామృతము

అమృతాంజనము
గోలకొండవలెను
సకల బాధలకు
వజ్రాయుధము

హైదరాబాదు ఏజెంట్లు:—
గోవర్ధనదాసు గోపాలదాసు వర్తకులు, ఇసామియాబజారు హైదరాబాదు దక్కన్.

## గోలకొండ పత్రిక

త్రూపుబజారు హైదరాబాదు దక్కన్.

సంవత్సరము చందా
రు. ౭—౦—౦
ఆర్ధ ,, ౩—౧౨—౦
విడి పత్రిక ౦—౧—౪

REG No N 45

RegNo.M.2185

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda power Press, Hyderabad and Edited by K. Balakrishna Reddy